ఉ. మారుఁడు చూడ నావరకు♦మారుఁడు బావమఱంది రాజు నా
పేరిటివాఁడు మాధవుఁడు ♦ పేర్మిని బ్రాణపదంబు గాలి నీ
వీ రీతి నేమి సేయుదువొ ♦ వేమఱుఁ జూచెద నీదుకోసమ
వ్వారిగ వారె బాము లిడి ♦ ప్రాణము దీసిన నిచ్చెదం జెలీ. 64

చ. చెలఁతకొ నిన్ను నమ్మితిని ♦ నీదుకురుల్ కుటిలమ్ము లాయెఁ జూ
పులు చపలమ్ము లాయెఁ గను♦బొమ్మలు వక్రము లాయెఁ గబ్బిగు
బ్బలు కఠినమ్ము లాయె మఱి ♦ భావము కర్కశ మాయె నాపయిం
గలుగుట యెట్లు నీకు దయ ♦ కన్గొనవే మది నంగనామణీ. 65

కం. చిగురువిలుకానిశరములు
తగ వెన్నునఁ దూరి నేను ♦ దల్లడపడఁగా
సొగసారి యింత యోర్తురె
నగినం దగుపాటి గాక ♦ నాళీకముఖీ. 66

సీ. వలచి పాయుట పగ♦వారికైనను గాదు
[1]మునుపుగా నన్నది ♦ మనమె కాదొ
కవఁ బాసి బ్రతికిన♦కాంతలఁ గాంతుల
నటు మెచ్చునిది మన ♦ మానొ కాదొ
మనకూటమికి నాడు♦కొనెడువారలకన్నుఁ
బొడిచినరీతిని ♦ నడువ లేదొ
యుదయాస్తమయముల ♦ మదిలోనఁ దలఁపక
గడియకు పలుమాఱు ♦ కలియ లేదొ

తే. గీ. యిప్పటిఋణానుబంధంబు ♦ లిట్టు లుండ
నైన నేమాయె నే మైన ♦ నైనఁ గాని
సుఖముగా నున్న నెపుడైనఁ♦జూడవచ్చుఁ
బోయి వచ్చెద చెలివిమ్ము♦పువ్వుఁబోఁడి. 67

చ. అనఁ గుబుసంబు నూడ్చినమ♦హాభుజగాంగన నా ముసుంగు తె
ప్పనఁ బెనవేసి లేచి ముడి♦బొమ్మ లెసంగఁ గటంబు లుబ్బఁగాఁ

1. మహిళలోన నన్నది. [మా].

గనుదొగ లెఱ్ఱవార ముఖ♦కంజము జేవురు దోఁపఁ జెమ్మటల్
కనఁబడఁ గావిమో వదరఁ ♦ గామిని పల్కె మహాపకోప మై. 68

ఉ. ఎవ్వరు పిల్చి రిచ్చటికి ♦ నెందుకు వచ్చితి వేమి కార్య మే
నెవ్వతె నీ వెవండ వింక ♦ నెవ్వరి కెవ్వరు దేని కేని మా
జవ్వని విన్న రవ్వ లిడుఁ ♦ జా ల్తడ వాయెను వచ్చి లేచి పో
నవ్వెద రెల్లవారలును ♦ నన్నును నిన్నును గోపశేఖరా. 69

చ. నిలుకడ సున్న తాల్మి నహి ♦ నేస్తము దబ్బర మాట పద్దులే
వలపు హుళక్కి యాన లుసి ♦ వావులు పైపయిమేల్మి నీదునీ
తులు మెలమెచ్చు లాదరణ ♦ దూఱు దయ ల్సట నమ్మ వచ్చునే
యిల మగవారిఁ దన్మహిమ ♦ లెన్నఁగ శక్యమె యిందులన్ హరీ.

చ. కపటులు క్రూరచిత్తులు స్వ♦కార్యపరుల్ కరుణావివర్జితుల్
చపలు లసత్యభాషణు లి♦ల న్మగవారలు వారిలోనఁ గొం
చెపునెరతుంటవింటివగ♦సామివి దేవర నీకు నాపయిం
గృప మఱి యేటికి న్గలుగుఁ ♦ గృష్ణ హరీ నవనీతచోరకా. 71

చ. మలఁకలమాట లిందు బహు♦మానము లచ్చట గచ్చు లిచ్చటన్
దలఁపులు దానిపైని ఖలు♦తప్పులు నాపయి నేస్త మాడఁ జే
రలుక మ ఱీడఁ గూర్మివగ ♦ లక్కడ నిక్కడఁ జిక్కు లద్దిరా
తెలియఁగ వచ్చె నీనడత ♦ తెల్లముగా విటలోకనాయకా. 72

చ. వలపులతిట్లు కొట్లు రతి♦పద్దులు నబ్బినచోట ముద్దులుం
గలుగఁగఁ బోదు నాయెడనె ♦ కాని మఱెక్కడ నంచు నుంటి చాల్
నలుగురిపట్ల నీ కిదియె ♦ నైజ మటంచు నెఱుంగ నైతి హా
నలువశిరంబు ముట్టినను ♦ నల్లనివానిని నమ్మ వచ్చునే. 73

ఉ. ఏమని చేరెనో చెలిమి ♦ యింతి రవంతయుఁ జింత సేయకే
వేమఱు నీదుపాలఁ బడి ♦ వేఁడి పెనంగిననాఁటనుండియున్
బాములె కాని సౌఖ్య మొక♦పాటిగ నైన నెఱుంగ నైతి రా
రామునిఁ బొందురామక్రియ ♦ రామునిసోదరుఁ డౌదు వన్నిటన్. 74

పంచమశంచితస్వ మప్పని ♦ మంచితనము
గలదె నిన్ననఁ బని యేమి ♦ కలికికృష్ణ. 79

తే. గీ. వారె కానుచుఁ జెలిఁగూడు ♦ వారు లేరొ
ప్రక్కఁ బాయక సతి నేలు ♦ వారు లేరొ
వనిత నైక్యము గొని పొర్లు ♦ వారు లేరొ
వారు నీవారి మెడఁగట్టు ♦ కోరు గాని. 80

సీ. గోముఖవ్యాఘ్రి మై ♦ గుదిగొనుమాయత్త
వదినగారికి మాఱు ♦ పలుక రాదు
మగఁ డైతె యేవేళ ♦ మండుచు నుండును
మామగా రంతకు ♦ మంట్లమారి
పెదబావగా రైతె ♦ బెబ్బులివలె దూఱుఁ
బినబావ చేకత్తి ♦ పెట్టఁ డవల
నిరుగుపొరుగువార ♦ లే యమదూతలు
తోడికోడలి కేదు ♦ రాడఁ గూడ

తే. గీ. దన్నదమ్ములు గన మేక ♦ వన్నెపులులు
సారిది నిందత్రికనుగట్టి ♦ నున్నఁ బెట్టి
నేను నినుఁ జేర నీవందు ♦ దానిఁగోర
బ్రతుకు బాగాయె ధూర్త గో ♦ పాలరాయ. 81

కం. అల్లందు కందుకొని నీ
బెల్లింపులఁ బడినమొదలు ♦ పెనుబాములకే
యి ల్లయితి నరసి చూడఁగ
గొల్లనితోఁ బొందుచెలికిఁ ♦ గొదవే కొదవల్. 82

కం. మును నిన్నుఁ గోరి చేరిన
దనుజాంగనముక్కు పోయె ♦ ధర నని తెలియన్
విని కని వలచితి నను చో
నిను దూఱఁగ నేల నన్ను ♦ నే ననక హరీ. 83

సీ. మును మున్ను క్రొన్నాళ్ళ ♦ మన మున్నయద్భుతం
బదివిప్పి చెప్పఁగా ♦ నలవి గాదు
తవిలి కొన్నిదినంబు ♦ లవల నభేద మై
మెలఁగితి మెడ లేని♦మేల్మి యెసఁగ
నంతట నీవు నే ♦ నని కొన్నివారమ్ము
లమరితి మిద్దఱ ♦ మగుచు వెలసి
యిప్పుడు ముగుర మై♦యీనలుగురిలోన
విను కాఁపురము మూఁడు♦విధము లాయె

తే. గీ. నేమిటిసుఖంబు లిఁకమీఁద ♦ నేటిబ్రతుకు
లేటివఱదలఁ బోయె నీ♦మాట లెల్ల
నూర కిటు రవ్వ లిడి సరి♦వారు నవ్వ
వసుధపైఁ దారి నే నుండ ♦ వలెనె శౌరి. 84

సీ. ఎన లేనిప్రేమ నీ ♦ వెపుడు వత్తువో యంచుఁ
దలవాకి లిల్లుగా ♦ నిలిచి యుంటి
రమణ నవ్వుచు నీవు ♦ రాఁ జూతునే యంచుఁ
బడఁతుల శకునంబు ♦ లడుగుచుంటి
ములు పోఁక కీవు రా ♦ వలెఁ జేర న న్నంచుఁ
గులదేవతల నెల్లఁ ♦ గోరుకొంటి
నేరీతి నైన నీ ♦ విటు రాక పో వంచు
నిలువనిప్రాణముల్ ♦ నిలుపుకొంటి

తే. గీ. మరునివెడవింటిపాల్పడి ♦ యెరుక గంటి
నిపుడు నిను గంటి నీమాట ♦ లెల్ల వింటి
విడుము మీఁకఁ దొంటిపోకలు ♦ నడుపవంటి
దంటయిళయింటికేపొమ్ము ♦ తమ్మికంటి. 85

సీ. నీదుముద్దులగుమ్మ ♦ నీమోవి నొక్కితే
కటకటా నామది ♦ కంద నేల

నీప్రాణనాయిక ♦ నీచెక్కు గీటితే
కనలి నామది చుఱ్ఱు ♦ క్కనఁగ నేల
నీదుచక్కెరబొమ్మ ♦ ని న్నెంచ కాడితే
పొగిలి నామది చిన్న♦వోవ నేల
నీదుపట్టపుదేవి ♦ నిను చాల నెనసితే
యుడుగక నామేను ♦ బడల నేల

తే. గీ. నీదుదొరసానిచనులచే ♦ నీయురంబు
నొగులఁ గ్రుమ్మిన నామది ♦ నొవ్వ నేల
దానిసొమ్ముల కెవ్వతెఁ ♦ దలఁచి చూడ
వలపు పగవారి కైనను ♦ వలదు కృష్ణ. 86

తే. గీ. మున్ను జత గూడి వెంటనే ♦ నిన్ను వీడి
ప్రాణములు చేర నిన్నాళ్లు ♦ పట్టె నౌర
మరల నినుఁ బొంది పోయిన ♦ మరులు చెంది
జాలిఁ బడఁజాల నందగో♦పాలబాల. 87

కం. ఈనాఁటివఱకుఁ గానని
యీనాయత మెల్లఁ గంటి ♦ నీనానినుఁ దా
నీనం గాచియు నిళకే
యీ నాయెను నింక నాస ♦ లేల మురారీ. 88

సీ. కావేటికాల్వలై ♦ కనుఁ బాఱుకన్నీరు
వారక తుడిచెడు♦వారు లేక
విరహాగ్నిశిఖలచే ♦ వేగుచుఁ బొరలాడ
నూరడిల్లుమ యను♦వారు లేక
దిగులుచే నిల లేక ♦ తెగువ నేఁ జేయుచో
వల దని పలికెడు♦వారు లేక
మరుకోల లెద నాటి ♦ నెరకొట్టు కాడఁగా
భయపడ వ ద్దను♦వారు లేక

తే. గీ. కలఁగి మోహాబ్ధిలో మున్గి ♦ గాలిసోఁక
గట్టు గానక యుంటినే ♦ గాసిపడెడి
నాఁటికే లేచిమఱి నీవు ♦ నేఁటి కేల
చాల తడ వాయె లెమ్ము గో♦పాలరాయ. 89

కం. మానమె ధనముం గేహము
మానమె సర్వంబు చూడ ♦ మానవతులకున్
మానము పోయినవెనుకం
బ్రాణముతో నుండ వలెనె ♦ పద్మదళాక్షా. 90

తే. గీ. అన్నియిటు లాడఁ గాంచి ము♦రాసురారి
రమణి దాసరితప్పు దం♦డమునఁ దీరుఁ
దీరుమాన మటంచని ♦ తెఱవపాద
పద్మముల వ్రాలె నళి తమ్మి ♦ వ్రాలినటుల. 91

కం. కని మంజీరము ఘల్లన
వనజజరుద్రాదివిబుధ♦వరసేవ్యం బై
తనరినహరిశిర మంచ్చో
వనజేక్షణ ద్రోచె వామ♦పాదముచేతన్. 92

కం. లేచి యదూత్తముఁ డనుఁ జేఁ
జాచ్చియ నాజన్మ మిపుడు ♦ సఫలం బాయెన్
నీచిన్నిపదము నొచ్చెనొ
నాచికురభరంబు దాఁకి ♦ నాళీకముఖీ. 93

చ. నెలఁతరొ యాలకించు తొడ♦నిగ్గు తళు క్కనఁ జీర జాఱఁగాఁ
గులుకుమెఱుంగుగబ్బిచను♦గుబ్బలు పొంగఁ బసిండియందియల్
ఘలుఘలుఘు ల్లనం జరణ♦కంజములన్ గొని తన్నివంత మై
ఝులుఝులుఝు ల్లనం బులక♦జాలము లెత్తె న దేమి తెల్పుదున్. 94

సీ. చేతుల మెఱపుల♦చెన్నులెం త్తైనను
తొడలఁ జెందిననిగ్గు♦సడుము మేలు

గబ్బిగుబ్బలపెంపు ♦ కలుము లెం తైనను
బిఱుఁదులనెరిమిన ♦ పెంపు మేలు
కనుబొమపైఁదగు ♦ ఘనఫాల మెం తైన
నునుబొత్తికమ్పుకం ♦ దువలు మేలు
పలికెడుపెదవులఁ ♦ గలయెఱు పెం తైనఁ
బలుకనియలచోటి ♦ పొలుపు మేలు
తే. గీ. పైకి నెగిరినచీరయె ♦ యాకసంబు
మిగుల నాలోనిద్రవమె పో ♦ గగనగంగ
యార నూఁగారురేకయే ♦ కారుమొగులు
వనిత యాలింగనసుఖంబె ♦ వక్షస్థలము. 95

చ. చులకనఁ జేసి నన్ వలపు ♦ చూఱలు వుచ్చిన పిస నాడినం
బలికినఁ బల్కకుండినను ♦ బాలను ముంచిన నీట ముంచినం
జెలి మిఁకఁ జాలు పొమ్మనినఁ ♦ జేరఁగఁ బిల్చినఁ బిల్వకుండినన్
భళిభళి యౌను గా దనినఁ ♦ బాయుదునా నిను రాధికామణీ. 96

వ. అనిన విని. 97

కం. వనజాక్షు యింత చేయఁగ
మన సొగ్గెనె యంతె చాలు ♦ మానముకన్నన్
విను ప్రాణ మేమి ఘనమగు
నని యీసును వలపు కోప ♦ మదనము గాఁగన్. 98

ఉ. అందపుపైఁటకొంగు వద ♦ నాబ్జముపై నిడి శౌరి చూడ నా
యిందునిభాస్య యేడ్చె నెలుఁ ♦ గెత్తి కలస్వన మొప్ప వెక్కుచున్
సందగుగబ్బిగుబ్బలను ♦ జాఱెడుతన్నయనాంబుపూరముల్
మందరమేరుశైలముల ♦ మాటికిఁ బాఱుఝురంబులో యనన్. 99

చ. చెలి యటు లేడ్వఁ జూచి హరి ♦ చేరి పదంబులు పట్టి కూర్మిచే
నెలఁతరో యేడ్వనేల నిను ♦ మించినవాఁడనె కోప మంతఁగాఁ
గలిగిన నన్నుఁ జేయఁ గల ♦ కార్యము లన్నియుఁ జేసికొమ్మి నే
తలఁపఁగ నీదుసొమ్మనుచుఁ ♦ దా బలిమిం గొని కౌఁగిలించినన్. 100

ఉ. అంతఁ బడంతి సై పఱచె ♦ నంబుజనాభుఁడు మోవి యాని సీ
మంతిని చెక్కు నొక్కె హరి ♦ మర్మము లంటె మిటారి ముద్దిడెన్
గాంతుఁడు గోట మీటెఁ జెలి ♦ కన్గొనె వెన్నుఁడు నీవి విప్పె నా
కంతునిదంతి తారసిలెఁ ♦ గమ్మవజీరునిపోరుకున్ వడిన్. 101

వ. ఇట్లనంగసంగరోత్సాహతరంగితాంతరంగులై రాధామాధవు
లొక్కరొక్కరి చక్కనినెమ్మొనికమ్మనెత్తావుల సొమ్మసిల్లుచు ముమ్మరం
బగుమోహంబుల నెమ్మదింజెంది రందు నందు సోదరీరత్నం బవాంతరలజ్జా
భరంబునుంగొన మందరధరుం డమందానందంబున నందం బగుచెందొగల
విందుచందంబును డిందుపఱచుసుందరమందస్మితవదనారవిందంబునం గ్రందు
కొని ముద్దువెట్టినం బెట్ట నీయక నిద్దంపుటద్దంబున కుద్దియై తద్దయు నొప్పు
ముద్దుచెక్కుల నొక్కిన నొక్కనీయక కప్పుగాఁ గప్పుకప్పులం గుప్పుగొప్ప
నెరికొప్పునిమిరిన నిమర నీయక చొక్కంపు కెంపుసొంపుసంపాదించు తావి
చెంగావిమోవి యానిన నాన నీయక కట్టాణిముత్తియంబులతీఁగెమోడికుట్టు
పనులఁ గనుపట్టుకెంబట్టురెకకుం బట్టుచాలక మట్టుమీఱి గుట్టు బయటఁ
బెట్టుగబ్బిసిబ్బెపుటుబ్బుగుబ్బచనుగుబ్బలం బట్టినం బట్ట నీయక రంగుబంగరు
దింటెనవిరివెంటనంటుతుంటవింటిదంటయింటి నంటిన నంటనీక మించుమించన
మించుక్రొమ్మించు మెయిదీఁగె కౌఁగిటఁ గదియించినం గదియించనీయక దా
పురంబులు వెట్టుచు నలయించిన నలయించువిలుగొన్నమన్నెదొరం గన్నమి
న్నయాయన్నులతలమిన్న నొంటికళ లంటి సొక్కించి వితాళించి చివచివ
లాడవఁ జివుకు చివుక్కునం బైకెక్కి నిక్కి చక్కెరమోవి నక్కజంబుగఁ
జుక్క లేరుపడఁ జాఱుక్కున నొక్కి మక్కువ నెక్కొనం జెక్కిలి గొట్టి
మదదంతిపై మంతుకెక్కుచూవంతుచెక్కున సొక్కు దక్కి గిలుకలచప్పర
కోళ్ళమంచపుహాళహాళలును వెలివక్కిరెక్క దూదిమెత్తలో నత్తమిల్లుకీచు
బుజ్జిలకూఁతలును సురతశ్రమంబుల నెదల గమగమవలచుగోరజవాదిప్రోది
నెత్తావులు ఘుమ్మఘుమ్మనం గ్రమ్మ బిసబిసవిస రెడిహాసపరిసురటిపిట్టల
రెట్టచప్పుడులును బకదారులమ్రోఁతలును సారసకోకిలములకివకివలును
సుకకిక్కిత్రిప్పక కొక్కొక్కశాస్త్రమ్ముం బ్రసంగించుకలికిచిలుకలకలకలంబు

లం గప్పినపరవశమ్ములం దప్పినమరుసామువరుస లెత్తి యిచ్చుగోరవంకల మెలుఁగులును నిచ్చలపుముచ్చటలం బెచ్చుపెరుఁగ మెచ్చు లిచ్చురాయం చలవళావళులును గళరవమ్ములును మంజుమంజీరఝుళంఝుళధ్వనులును విడ కువిడువకుతడఁబడకుమెడమిడక విడివడి తొడఁబడ నడుమడుము మనునుచు వులును ఘనజఘనసంఘట్టనా చటచటాత్కారంబులు తోరంబు లై మీాస రంబు లగు పై సరంబు లెత్త నాబిత్తరి తత్తరిలక హత్తుకొని తనకుతళుక్కు మనుచిలుకతేజీవజీరుహజారంబునం దమి చిలుక నెదురొత్తు లిచ్చుచు సాటి లేనిమేటిగోటిపోటులం జొత్తిల్లు కొత్త నెత్తురుల మత్తిల్లుబిత్తరపుగుత్తంపు చనుగుత్తు లెద నొత్తి యిరుఁగేలు సాచి కంబుధరుగళంబును గాఁగిలించి మోము మోమునఁ జేర్చి తన్మధురాధరసుధారసధారలం గ్రోలి తియ్యని రుచులం దేలె నిట్లిరువురు నొడలడరఁ దొడరిదుముకు లదరింపులు భ్రూభం గంబులను చిఱునన్న లుద్దవిడిపద్దులగ్గలికెతాఁకునూకులువీఁకమీాఱ బాహా బాహిం గచాకచిం బెనంగుచుఁ జెంగట నెసంగుభర్మనిర్మిత చిత్రరత్నరత్న మాలికాయంత్రపాంచాలికాహస్తవిన్యస్త మల్లరంగసముల్లసితమల్లవల్లభుల దండివెనుదండివిడక న్యస్తసువర్ణవర్ణనీయసుగంధబంధురకుసుమతాళవృంతో ద్ధూతహాతప్రవర్ధితాగురుధూపధూమస్తోమంబు లెగిరి నిగనిగ మనుజిగిమొగు లనఁ గప్పుకొని యన్యోన్యాననాలోకనోత్సాహమోహంబుల నించుక యప నయింపఁ బునఃపరస్పరదర్శనోద్యోగవేగంబులంబుట్టి బెట్టునిట్టూర్పుగాడ్పు లం గొట్టువడి యెట్టకేలకుం దెట్టగిలి నెట్టన మొగంబులు చూచుకొని తడ వెడసి యొడఁ బడినజక్కవపక్కులమక్కువ లంది యిం పొందం బొందు చౌశీతిబంధప్రతిబింబంబుల ముకురంబులం గని సంకుచితమందహాసంబుల నిరవొందుచుఁ బెనంగుసమయంబున. 102

కం. హత్తుకొని యిన్నివిధములఁ
దత్తరపడ నన్నఁగి పెన్నఁగి ♦ తనివారక యా
బిత్తరి పై కొనె హరిపై
మత్తేభమునిూఁద నెక్కు ♦ మావంతుఁ డనన్. 103.

సీ. మరుగుహారముఁ బోలె ♦ గిఱికొన్న నెరికుఱు
ల్గ్రిమ్ముమున్నాఁచుచీఁ♦కటులు గాఁగ
జలజల మని రాలు ♦ సన్నజాజులచాలు
చీలి వ్రాలెమురిక్క♦చాలు గాఁగఁ
జిఱుకమ్మచెమ్మట ♦ ల్నెరిఁ దోఁచుఫాలంబు
కేజ్జేనిచిన్నారి♦రేక గాఁగఁ
గరఁగి జాఱిన సిస్తు♦కస్తూరితిలకంబు
క్రందుగాఁ జెలువందు♦కందు గాఁగఁ

తే. గీ. వలపుచిఱునవ్వు లలతివె♦న్నెలలు గాఁగ
నాశలను బెంచి కానని♦యంద మూని
కృష్ణపక్షరీతి నా♦కృష్ణవేణి
కృష్ణదేవునిపై నుండి ♦ కేళి సలిపె. 104

సీ. చెంపు గోరించిన♦దండిగాఁ బైనుండి
కేఱుచసన్నలఁ బఱఁ ♦ గొంతసేపు
గాలి చక్రముఁ జుట్టు♦కరణిని దిరుగుళ్ల
వింతగాఁ దిరుగును ♦ గొంతసేపు
పసిడిజంత్రపుబొమ్మ♦పగిది విన్నాణముల్
కులుకుచు నటియించుఁ ♦ గొంతసేపు
తుద నాడుబొంగరం ♦ బిది నాఁగఁ గసి దీఱఁ
గంతుశివం బాడుఁ ♦ గొంతసేపు

తే. గీ. అభినయము పట్టు మని చెక్కు ♦ నమరఁ గొట్టు
ముద మొదవఁ దిట్టు ముద్దుపై ♦ ముద్దు వెట్టు
మర్మములఁ గొట్టు మెలమెల ♦ మబ్బు దట్టు
బాల హరిపైని బుంభావ♦కేళి వేళ. 105

చ. సరసిజగంధి యీపగిది ♦ శౌరిని గూడుక కౌఁగిలింపఁగా
గిఱికొని ముత్యపుం సరులు ♦ కెంపులదండలు ఝల్లు ఝల్లనన్

బెరుగుచు రాలెను స్మరుండు ♦ నేర్పునమల్లియతూపుగుంపు ల
గ్గురుశిఖివిస్ఫులింగములఁ ♦ గూడుక రాలినలీల దోఁపఁగన్ 106

వ. అట్టియెడ దనుజ మదనజనకుం డామదవతిం జూచి యిట్లనియె.

సీ. వలుదగుబ్బలగోరు♦వంక లేదని రాధ
యని నీ వెఱుంగుదు ♦ వంబుజాక్ష
చక్కెరకెమ్మోవి ♦ నొక్కు లేదని రాధ
యని నీ వెఱుంగుదు ♦ నమరవంద్య
మిసిమిచెక్కులఁ బెమ్మ♦రసము లేదని రాధ
యని నీ వెఱుంగుదు ♦ నాదిదేవ
తగువెన్నుసరిపెన♦దండ లేదని రాధ
యని నీ వెఱుంగుదు ♦ నతనుజనక

తే. గీ. యనుచు నిరువురు గడిదేరి ♦ హావుసుమీఱి
యాని సరిపోరికెమ్మోవు ♦ లానఁజేరి
తమి చెలఁగఁ జీరి యలకేర♦జములఁదారి
[1]కోరి మరుబారి నలసిరి ♦ కొమరు మీఱి.

సీ. రమ్యబృందావనా♦రామసీమలయందు
[2]నతులితగోవర్ధ♦నాద్రియందు
సత్పథోజ్జ్వలరత్న♦సౌధాగ్రములయందుఁ
దరణిజాసైకత♦స్థలములందుఁ
బారిజాతలతాంత♦పర్యంకములయందు
బహుచిత్రకేళికా♦గృహములందు

1. కూడి మరుకేళిపలిపిరి ♦ కోవ మారి. [మూ].
2. స్వచ్ఛోదకాపూర్ణ♦సరసు లందు. [మూ].

మారుతకలితవా♦నీరకుంజములందు
భీమనదీతీర♦భూములందు

తే. గీ. సరసభాండీరవటతరు♦చ్ఛాయలందుఁ
జారుతరచంద్రచంద్రికా♦పూరమందు
దేవదేవుండు రాధికా♦దేవితోడఁ
గూడి విహరించె మదిలోని♦కోర్కు లలర. 109

తే. గీ. సంపదలు గల్గురాధికా♦సాంత్వనంబు
చదివినను విన్నఁ గైకొన్నఁ♦జదువుచున్న
వారి కవ్వారిగా నల♦వార వారి
జాక్షుఁ డొసఁగును గోరిక ♦ లధికదయను. 110

శా. శ్రీలక్ష్మీముఖపద్మషట్పద తను♦శ్రీశిక్షితనీలాంబుదా
లీలామానుషవిగ్రహా ప్రమదలీ♦లీహానశయ్యాస్పదా
కాళిందీతట కేళికోవిద మహా♦కంసాదిదుష్టాత్మదా
కాళీయోరగరత్నరంజితపదా ♦ కౌంతేయధైర్యప్రదా. 111

కం. సారగదాధార సదా
చార సదాతనువినూత్న♦చారుతరోద్య
న్మారజితాకారయుతా
ధీరనుతాపారచరిత♦ధిక్కృతదురితా. 112

మ త్త. నాగపాలక నాగదాలక ♦ నాగఘాలకవాహనా
వాగధీశ్వర వాగహీశ్వర ♦ వాగనశ్వరగాహనా
యోగచారణ యోగధారణ ♦ యోగకారణ సాహనా
భోగశోషణ భోగిపేషణ ♦ భోగిభూషణమోహనా. 113

## గద్యము.

ఇది శ్రీచిన్నికృష్ణకరుణాకటాక్షవీక్షణక్షణప్రవర్ధమానానూనశృంగారరసప్రధానసంగీతసాహిత్యభరతశాస్త్రాదివిద్యాపారంగత శ్రీమత్తిరుమల తాతయాచార్యపాదారవిందమిళిందాయమానమానసచోళ సింహాసనాధ్యక్ష ప్రతాపసింహమహారాజ బహూకృతానేకచామీకరాంబరాభరణ ముత్యాలుగర్భశుక్తిముక్తాయమానముద్దుపళనిప్రణీతం బైన రాధికాసాంత్వనం బనుశృంగారప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.



తే. గీ. కృష్ణదేవునియాజ్ఞ నీ ♦ కృతిని ముద్దు
పళని యనువేశ్య రచియించె ♦ లలితపణితి
అధికశృంగారకావ్య మై ♦ యలరియుంట
దీని ము న్ముందుఁ బ్రకటింపఁ ♦ బూనినాఁడ.

ఇట్లు,
కో సూ రు గు రు నా థ మూ ర్తి,
స్థా ప కుఁ డు,
శృంగార కావ్య గ్రంథమండలి.

# తప్పొప్పులు

—:0:—

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 12 | 27 | కరున | కర్జున |
| 13 | 13 | ల్గీను | ల్వీను |
| 55 | 3 | జిగిగంద | జిగిచంద |
| 105 | 27 | జెపృటో | జెప్పుడో |
| 136 | 21 | లిగింతగి | గిలిగింత |
| 144 | 12 | పక్షు | పక్షము |



# సప్తపదులు

— ము[illegible] —

*

ర స స మా క్షు

వెంపటి నాగభూషణం: ఎం. ఏ.



గోపకిశోరుని వల్లవీ—పల్లవ—విలాస రాసక్రీడావిహారములు ...వ్రజ—అభీరులకు, కంటకములైనా, దేవతలువూతేము—నీల వర్ణుడు గోపభామలను సూర్యసుతాపులినసీమలకు మరలించుకుని పోయిన ప్రత్యావసరానా—విరులవాసలు కురియించి, ఆమోదకోలా హలను చేయకుండా మానలేదు. వావివరుసలకు అవసరమూ—అవకాశమూలేని అమృతమూర్తులకు...స్వైరగమనము విధాయకము. నందకుమారుని మార్కటకిశోరవినోదములకు, అంతకూ తలమీరిపోయిన చేతలకు—భాగవతులు తగులాటమొనరించిన పరమార్థము...ఉండనే ఉన్నదికదూ, పరువుకాపాడటానికి!

— గోకులములో, కృష్ణుడు — అడ్డుపెట్టేవారులేకుండా, ఎవరు ఏమనుకుంటారో,—ఇది ఉచితమా—అనుచితమా అనే బెరుకు లేశమున్నూలేకుండా,...గొల్లకన్నెల మానధనములు స్వాయత్తం చేసుకోవడం —కులపెద్దలు చూసిచూసి సహించలేక,—ఇకనుంచీ ఆడవాళ్లెవరూ కృష్ణునిచాయలకైనా పోరాదని, అతని కంటికైనా కనపడరాదని,—అనుశాసించి, ఉల్లంఘనముకాకుండా, వేయికన్నులతో కాచుకుంటూఉన్నారు. ఈ కట్టడి, గోపికల శృంగారవల్లరికి లవిత్రాఘాతతుల్యము గనుక,...ఎవరిలోవారు తగని వేదనననందుతూ, కోరినదేవతలకెల్ల మొక్కుకున్నారు—ఎన్నడూ లేని ఈకోరంటికము మాయమయ్యేటట్టు చేయమని.

—కృష్ణునికిజరిగిన ఈ అపచారానికి ఫలింతగా, దుర్భిక్షము బలిసిపోయింది. పాడిపంటలమీదనే ఆధారపడిన జీవనముకనుక, వర్షములు కట్టుపడేటప్పటికి గోపకులు విధిలేక రాజీకి రావలసి వచ్చింది. గోపికలు అందరూకలిసి—వర్షాగమనమునకు వ్రతము

ఆచరించి,...నరు ఒకే, కృష్ణుని ప్రసన్నులనుచేసుకోవాలి. ఈవిధా నముగా ఫలించును ..శ్రీకృష్ణునికన్న ఎవరు, తగినవారు?

సరే, విధానాన్ని అనుసరించి, నిష్కామప్రవృత్తిని, కామ్యా లాభములకోసం, గోపికలు వ్రతం ఆచరించి,...కృష్ణునిదర్శించారు —సాయంవేళ. అతడు, వారికి వేడుకను రమ్మని పంపి, తాను నీలాదేవితో శయ్యాగారము ప్రవేశించాడు. పల్లవకాంతలందరూ, ఎవరియింటికి వారు వెళ్లిపోయినారన్నమాటేకాని, ... కృష్ణునిమీాది మమత, అచిరకాలంలో అతనితో కూడి అనుభవించేభోగములు,... కంటికి రెప్పకూ దూరముచేసినవి. తెల్లవారేదాకాకూడా నిలువలేక, ఇలువెడలి, ఒకరిని ఒకరు కోడిగములాడుకుంటూ, వరుసలతో లేపు కుని చెట్టాపట్టాలువేసుకుని—నందునియింటికివెళ్లి, అక్కడివారినం దరినీలేపి,...కృష్ణుని, ఇంకాకౌగిలిలోనే కట్టివైచుకుని విడువకుండా పడుకున్నందుకు—నీలను పరిహాసమాడి,—ఈ అలికిడిని నిదుర మేల్కొంచిన నాగరశిఖామణిని, భక్తితో—పారవశ్యముతో, హెచ్చ రికలు మనవిచేసి...కొలుచుకుంటారు....

—ఈ కథాసంవిధానమును అవలంబనముగాచేసుకుని—చూడి కుడుత్తాళ్...ఆండాల్ దేవి—'తిరుప్పావై'గా, ముప్పది 'పాశురము' లను—గేయగాధలను—ద్రావిడంలో రచించింది.

'నాలాయిర' మ్మను—ద్రావిడసంహిత మొదటివేయిలో —ఈముప్పదిపాశురములున్నూ సంకలితములైనవి. దక్షిణదేశం అంతటా—వైష్ణవాంగనలు, వైష్ణవులు—ధనుర్మాసములో, వేకు వను, ఉలూలుధ్వనులతో, రోజుకొకటివంతున, 'తిరుప్పావై' ద్రావిడగాథలను పఠిస్తారు....

గోపికలు వైష్ణవలాంఛనలైనా, వారి కులదేవత—కాత్యా యని: ఆమెను ఆరాధించినందువలనే కృష్ణసాంగత్యలాభము కల

రూపమున సిద్ధించినది—అని, భాగవతపురాణము ప్రవచనము. అనురూపుడైన వరుణ్ని కన్నెలు సంపాదించే అధికారం, మొదటినుంచీ...కాత్యాయనికే స్వాధీనమైపోయినట్లు కనబడుతూన్నది. వివాహవిధిలో సూత్రధారణకుపూర్వము, పెండ్లికూతురు గౌరీపూజ చేసుకుంటుంది. వస్తుతః కన్య—ఆలయమునకువెళ్లే అలవాటు ఉన్నా,—కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకుపోయినప్పటినుంచీ కాబోలు బహుశః,—ఇంటిలోనే పూజచేసి సరిపెట్టుకోవడంగా మారిపోయింది. 'గొబ్బెమ్మా...మొగలిపూవంటి మొగుణ్ని ఇయ్యావే?'—అని, బాలికలుపాడే గొబ్బిపాటకు ..కాత్యాయనీవ్రతమే మూలరూపము.

—ఇక, ద్రావిడకవయిత్రి...జీవితగాథ:—పాండ్యమండలములో శ్రీవిల్లిపుత్తూరు...ధన్వినవ్యపురము—అనే పుణ్యగ్రామము. అక్కడవెంచేసిఉన్న వటపత్రశాయి..'వడపెరుంగోయిలాన్'...అర్చావతారమూర్తి, ఆలయపరిచారకుడు—ముకుందాచార్యుడు. అతని కుమారుడు—విష్ణుచిత్తుడు: మహాభక్తుడు. ఎప్పుడూ, స్వామికి మాలాకైంకర్యమునుచేసి, సేవించుకుంటూ, పుష్పోద్యానమును పెంచుతూ,...దేవ—దాసభావమువహించి—జీవితమును పునీతము చేసుకున్న భాగవతుడు. చదువుసంధ్యలు లేనివాడైనా, స్వామిదయను, ఆ జగత్పతి ఆజ్ఞమేరకు,—పాండ్యమత్స్యధ్వజుని—శ్రీమార శ్రీవల్లభ—ఏకవీర—పరచక్రకోలాహలుడు (815–62) — సభలో...వేదాంత శాస్త్రవాదముచేసి, విశిష్టాద్వైతస్థాపనాచార్యుడైనాడు. 'పెరియాళ్వారు'—దొడ్డభక్తుడు—అనే ప్రఖ్యాతనామం వహించాడు. ఈయన ఆళ్వారులకోవలో—నాలుగవవాడు.

—దిగ్విజయంగా కృతార్థుడై, రాజసభనుండి తనఊరికి తిరిగివచ్చినతరువాత, విష్ణుచిత్తుడు ఒకనాడు — మామూలుగా, తులసితోటలో పెళ్లగించుతూండగా, వృక్షమూలమున, భూమిలోంచి—ఒకకన్య ఆవిర్భవించింది...

'—ఖనిత్వా నక్షేత్రేణ, విష్ణుచిత్తే మహాత్మని, తులసీవృక్షమూలస్య ఖననంచ ప్రకుర్వతి లక్ష్మ్యంశాల్లోకరక్షార్థం గోదాభూమ్యాస్తతో జని, '...(ఆముక్తమాల్యద అవతారికలో ఉదాహృతం.)

—ఆపిల్లను యింటికితీసుకువెళ్లి, భార్యా—తానూ పెంచుతున్నారు...గోదా అనేపేరుతో పిలుచుకుంటూ. ఆమె చిన్నప్పటినుంచీ భక్తి ఆవేశముకలిగి,—నారాయణునేతప్ప ఇతరుని పెండ్లిఆడనని కూర్చున్నది:

అదీగాక రోజూ, తండ్రి...స్వామికి అర్పించడానికి పట్టుకు వెళ్లే మాలికలు, ముందుగా ఎవరూచూడకుండా, ఒకమారు తలలో అమర్చుకుని,...భావిసీటిలో అద్దంచూచుకుని,—తీసి అక్కడఉంచేది, ఏమీ ఎరుగనట్లు.

ఒకనాడు, ఈఅపచారము విష్ణుచిత్తుని కంటపడినది. ఆతను, కూతురినిమందలించి, రిక్తహస్తములతో—ఉన్నపూలన్నిటితో అదివరకే మాలకట్టినాడుకదూ?—ఆలయమునకు వెళ్లేటప్పటికి,...స్వామివారే నోరుచేసుకు అడిగాడు—మాలలు తేలేదేమని. విష్ణుచిత్తుడు జరిగినవిషయం మనవిచేయగా, భగవంతుడు ఆతన్నిమందలించి,...గోదా, లక్ష్మిఅంశకాబట్టి ఆలాచేసినా దోషం లేకపోవడమేకాకుండా, ఆమెధరింపనిదీ తానుస్వీకరింపనని...సెలవిచ్చాడు:

—అందువల్లనే, గోదాకు—చూడికొడుత్తాళ్—ఆముక్తమాల్యద,—అని పేరువచ్చినది:

ఆనాటనుంచీ, విష్ణుచిత్తుడు కుమారితెను సాక్షాత్ పరదేవతలాగు బహుమానించుతూండేవాడు:

గోదాదేవి పెద్దదై, యౌవనవతిఅయి, అహర్నిశములూ కృష్ణుని ధ్యానంచేస్తూ, ఆయనను పొందవలెనని,...వెనుక, గోపికలు కృష్ణలాభప్రాప్తికి కాత్యాయనీవ్రతముచేసినారని వినిఉన్నదిగనుక, ...తానుకూడ, ధనుర్మాసము నెలరోజులూ, వేకువనులేచి, స్నాన

గ త్తెలతోబాటు వ్రతంచేస్తూ,...రోజుకు ఒకటిచొప్పున... ముప్పది 'పాశురముల'ను రచించింది: అవే—'తిరుప్పావై' పాటలు...

—పిల్ల, క్రమక్రమంగా మారిపోయి, రోగనిష్ఠలో పడి పోవడంచూచి,—ఛాందసుడైన విష్ణుచిత్తుడు, విరహవేదన అని, పోల్చుకోలేక, గాభరాపడి, ఆదుర్దాగా,—ఈసంగతి వటపత్రశాయికి విన్నవించి, ఆయనసలహామీద గోదాను శ్రీరంగంతీసుకువెళ్ళి,... రంగనాథునికియిచ్చి వివాహంచేశాడు. ఆమె, శేషజీవితం,... సాయుజ్యప్రాప్తివరకూ అక్కడనే గడిపింది.

—ఈకథ...వైష్ణవసంప్రదాయ గ్రంథమైన—'గురుపరంపరాప్రభావము' లోనిది: ఇదే, కొన్నిమనోహరములైన మార్పులతో, కృష్ణరాయని 'ఆముక్తమాల్యద' ప్రబంధమునకు,—కథాలవాలమైనది. వివరములు విపులముగా తెలుసుకునేందుకు—మేడేపల్లి వెంకటరమణాచార్యపండితుల — 'ఆముక్తమాల్యద' పీఠిక—చక్కగా ఉపకరిస్తుంది.

గోదాదేవి 'పాశురములు'— వైష్ణవులలో బాగా ప్రాకిపోయినవి. వాటిని— ఎరుగనివారు, కొన్నిఅయినా పఠించనివారు, అరుదు. నాలాయిరములో గోదారచనలు ఇంకా చాలావున్నవి.

ఇరువురికీ చిన్నికృష్ణుడే అధిదైవతము.... మధురభావనలు, కలిగిన, సరసవాణి—ముద్దుపళని,... 'పాశురముల'ను 'సప్తపదులు'గా ద్రావిడములోని—నానార్థచమత్కారగుంభనల తీయదనముసోనలు తీరేటట్లు—తెలుగు చేయదలపెట్టడము... తెలుగునాడు నోముఫలము.

—కాని, రవంతకించ కలుగుతూన్నది. ఇంతవరకూ, ముద్దుపళని 'సప్తపదులు' ముప్పదిన్నీ లభించకపోయినందువల్ల, ... దొరకినంతవరకూ, పదిగాథలు,—రచనాలాలిత్యాన్ని వెలయించడానికి చాలినవైనా,...చవులుమరిగిన రసరసనకు,—అంతటితో తనివినందే అ—కళా—స్వాస్థ్యములేదు:

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు, — ఈవిషయంలో, తాముచేయగల్గిన సాహాయ్యము... తెలుగుతల్లికి...సాహసించి— చేశారు. ఉపలబ్ధములైన—ముద్దుపళని 'సప్తపదుల' లో నెరసులను,—పూర్వలేఖక ప్రమాదవశములైనవాటిని, — మాతృకతో పరిపోల్చి సవరించి,—మిగిలిన ఇరవై పాశురములకున్నూ 'వాక్కులందు భక్తిరసము వాకలూరగా'—తెలుగు సాయించి చక్కనిపీఠికతో, 'సప్తపదుల'ను — ఒక 'పుష్కరం' క్రింద ప్రచురించారు. శ్రీశాస్త్రిలవారు,...ముద్దుపళని పద్ధతిని అనుసరించి, 'సప్తపదు'ల మిగతాగ్రంథమును పూరించకుండా, ద్రావిడగాధలకు వివరణంవ్రాసి ఊరుకున్నా,—ప్రమాదమేమీ ఉండేదికాదు...

అతుకు అతుకుగానే ఉన్నందువల్ల ... రసవ్యత్యస్తమునకు ఏమీకాని —గ్రంథమునకు, ఛందోరీత్యా, ఏకరూపమిచ్చినశ్రమకు —శ్రీశాస్త్రిలవారు వంద్యులు.

ముద్దుపళని—ఒకవేళ—పది 'పాశురము' లకు మాత్రమే తెలుగుగీతములు కూర్చినదేమో అనిపిస్తూన్నది గ్రంధమంతా ఆమె రచించినదని వినికిడి అయినా ఎక్కడాలేనందువల్ల. పైగా, మొదటి పదే— ముప్పదిగాధలలోనూ...రసజీవమణులు. అనర్ఘభోగములకే అలవడిన ముద్దుపళని, అలా చేసియున్నదనడంలోనూ...అనౌచిత్యము ఏమీలేదూ....

'నోమునోచువారు—నోచు నోముతీరు తెలిపెగోప
కామినులకు—విష్ణుచిత్త కన్యకామణీ .....'
...తెలుగువారందరికీ...ఈతీరులు ఎరుగతగినవే...

VNBhushan.



# సప్తపదులు.

---

నీలాదేవి పయోధరాద్రినమురన్ ♦ నిద్రించు శ్రీకృష్ణునిన్
మేలా నీకిది వేదవేద్యయనుచున్ ♦ మేల్కొల్పఁగా లేచి తా
వాలాయంబుగఁ గొప్పునంటిమిగులన్ ♦ వాసించుపూదండచే
లీలన్ గట్టినగోదకెప్పుడుమనో ♦ లీలాశికిన్ మ్రొక్కెదన్.

౧

'మారుహాడిత్తింగళ్'!

శ్రీనివాసగురునిఁ దలఁచి చిత్తమునను ముద్దుపళని
    పూనిచేయు ద్రవిడపాటలోని భావమూ
చెలఁగి తెలియ వాణి తనదు జిహ్వాకొనను నిలిచి యిటుల
    పలికెఁదిరుప్పావు సప్తపది పదంబుగా ♦—
మాసములకునెల్ల మంచి మార్గశిరము పర్వ మహహా
    యాసగలిగినట్టి చెలులు డాసిరారే
మంచివగలమించి కులమునెంచి యవతరించినట్టి
    చంచలాక్షులెల్లఁగూడఁ జనఁగరారే
న్యాయశాలియైన నందనందనుండు తోయజాక్షి
    శ్రీయశోద కనిన సింహశిశువు గాఁడటే
నల్లమబ్బుచాయమేనిఁ దెల్లఁజేయుడాలుగల్గు
    ఫుల్లపుండరీకనయన పురుషవర్యుఁడే!

కీరవాణులార! హరిని గోరి చేరి తేరి సకల
పూరుషార్థములను దృప్తిఁ బొందరారే!

౨

'శ్రీవైష్ణవుల్'

వారిజాక్షులార! నందవ్రజనివాసులార మనము
కోరునోముక్రియలువినుఁడీ కూరిమలరనూ
పాలవెల్లిఁ బాపసెజ్జఁ బండుకొన్న పరునియడుగు
లోలిఁగొల్చి నేయిపాలు కోరిలఁగూడదూ
కనులఁ గానలుదీర కనుపు కాటు కుంచరాదు విరుల
ననలఁదుఱుమరాదు కురుల ననువుమీఱఁగా
తెల్లవాఱకుండ నీటఁ జల్లులాడి మనము పెద్ద
లెల్లఁజేయనట్టిపనుల నొల్లఁగూడదూ
వికచకమలనేత్రునెదుట నొకరికొకరుపల్కుపలుకు
ప్రకటమొప్పఁగాను బలుకఁబడఁగఁగూడదూ
బాగుమీఱ మనకుఁ దెలుపఁబడినతీరు జనులకెల్ల
వేగ తెలిపి బ్రదుకుతీరు వెదకి ముదమునా
సారెసారెవిభుని మనము సన్నుతించి సంతసించి
వారిజారిముఖుల మెల్ల ప్రీతముచేతమూ

౩

'వోంగివులకుదంద'

నోమునోఁచువారు నోఁచు నోముతీరు తెలిపెగోప
కామినులకు విష్ణుచిత్త కన్యకామణీ
వడుగుచిన్ని పెండ్లికొడుకు పొడవుఁదొడరి పుడమిముఖాఁ
డడుగులడుగువానిపేరు నుడువుకొనుచునూ

ప్రేమమీఱఁగాను మనము నోమువట్టి నీరాడ
భూమిమీఁదఁగురియు నెలకుమూఁడువానలుగా
పెరుఁగునీటివరులనడుమఁ దిరుగుమీలు మాటఁగా న
కరుల తెరలుపోకలుగదలి కలువ లూఁగఁగా
నెమ్మిమీఱఁ దేనెఁద్రావి సొమ్మసిల్లి నట్టియూఁదుఁ
దుమ్మెదలును జేగి మగల దూఱి పలుకఁగా
చెలఁగి పిదుకఁగలుగువారు చెయ్యివేసితియ్యఁగాను
నిలువుకడువలెల్ల బాల నిండిపొరలఁగా
కుదురుకొందము మొదవుగుంపు పదులునూర్లు పెరుఁగ సం
పదలఁబొంగలిగొల్లపల్లె బాగుమీఱునూ.

౪

'ఆఙ్షిమళైక్కణ్ణా'

గోపవృద్ధులెల్లఁగోరు కోర్కెఁగురియువర్షదేవు
రూపుఁజూచిచేయుక్రియల రూపుఁదెలిపిరీ!
ఓగభీరభావమేఘ! ఓగుణాఢ్య! దానధుర్య!
బాగుగ నీచేయవలయు పనులువింటివా?
జలధికేఁగి నడిమిజలము కోలఁదిమీఱఁ ద్రావి యుఱిమి
వెలయుఁ గలయ మిన్నుముట్టి యలముకోవలెన్
జలధిశాయిమేనిడాలు గలుగునట్టిమేనుదాల్చి
చక్రికాంతిసరణిదెలియఁ జక్కమెఱయుమా
పాంచజన్యమనెడుసంకు పగిది మ్రోసి శార్ఙ్గమట్లు
మించి యంబు లొక్కమొగిని నించి కురియుమా
గామకొన్న మేముమేని గాముతీఱ త్రేపకడను
క్షేమ మలర నీటనాడి తేలఁగియుందుమా

సంతసమున కాక నోచు సుందరాంగు లెల్ల మనము
చెంతకేగ కోరికె గురిసె మేఘుఁ డందునెమ్మనా.

౫.

'మాయనై మన్ను'

కోమలాంగులార! మనసు కోర్కెలెల్లఁదీరమనము
నోమునోఁచగాను వాన భూమిఁగురిసెనూ.
అనిన, నొక్కచెలియ పలికె నతివలార! మాయవాని
ఘనునినుత్తరంపుమథురఁ గాచువానినీ!
గొల్లపిల్లలందుఁగలసి జల్లులాడి కొల్లలాడి
యుల్లసిల్ల యమున చెంతనున్నవానినీ.
యదుకులప్రదీప మనఁగ నుదయమంది కన్నతల్లి
యుదరశోక మెల్లఁబాపి యొప్పినాతనీ.
కాంతలార! మనము శ్రీకాంతుఁగూడిచెంత వాని
వింత నోటి నిండఁబాడి వినుతిచేసినా
చేతులున్న ఫలముపూజసేయ శుద్ధభావములను
ఖ్యాతిమీఱ వానిఁజూడఁగలయఁగల్గినా
తొంటిపాపజాలమెల్ల మంటఁబడినదూదివోలె
నంటులేక చెడును నోముపంటపండునూ.

౬.

'పుళ్ళుంశిలంబినకాళ్'

ముందులేచినట్టిసకల సుందరాంగు లొక్కముగ్ధ
మందయాన నిటులనిదుర మలుపవచ్చిరీ.
పక్షిజాలమెల్ల దెసల వీక్షణములు గొలిపి వేగ
కుక్షులకయి కూఁతలిడుచు గూళ్లువదలెనూ
పంకజాక్షుసేవజ్ఞప్తి పఱచుకొఱకుఁ దెలుపు తెల్ల
సంకుపిలుపునీదుకర్ణ సరణిఁజొరద టే!

బాలలేచిరావె నందబాలుఁడు దాఁ బూతనచనుఁ
    బాలుద్రావి నాఁటి యముని పాలు చేసెనూ.

రక్కసుండు బండిరూపు నుక్కుమిగిలి రాఁగ సంఘ
    టొక్కమొగిని వ్రక్కలుగాఁ ద్రొక్కెముకుందునా

మునులు యోగిజనులు నీటమునిఁగి నేక్క హరిహరీ
    యనెడునాద మినుముట్టించె వినఁగరావటే!

మెల్ల మెల్ల నుల్ల మల్లఁ బల్లవించి చెల్లసంత
    సిల్లి లేచినారమిటుల మల్లి లేఁగదే!

౭

‘ కీచుకీచెక్కాటంగు ’

విరివిమీఁద హరిని గలయనెత్తిఁగి మఱచికనుమొగడ్చ
    సరసిజాక్షి నిదుర తేప సఖులు వచ్చిరీ.

కుటిలనీలకుంతలాకతె చటులసూక్తి పటిమఁ బల్కు
    నటన దెలియకుండ నొక్కనాతి పలికెనూ

కీచుకీచు మనుచుఁ బక్షులేచి లేచి కూయుచుండె
    లేచిరావె పెరుగుతరువఁదో చెమిన్ననా.

గల్లుగల్లుమనెడినగల కలరవంబుఁ దెల్లదమ్మి
    కనులవానిమీఁదిపాటఁ గలసి మ్రోసెనూ

వినఁగఁబడదె వెఱ్ఱిపిల్ల విడిచి నిన్ను వెడలలేక
    కనుగొనంగ నున్నమమ్ముఁ గనవె నాయికా

హరి దయాభిపరవశుండు పరుఁడటన్న మొరలు చెప్పి
    దరికిరాఁగ నిదుర చెందఁ దగునె నాయికా!

తేజమొప్పఁ గన్నువిప్పి తెప్పరిల్లి లేచివచ్చి
    రాజసమునఁ దలుపుఁదీయ రావె నాయికా.

౮

## ' కీళ్వానం '

బాలలెల్ల నందగోప బాలునకునువలపుగొలుపు
లీలగలిగినట్టిసఖిని లేపవచ్చిరీ
ఇదిగో తూర్పుతెల్లవారె నదిగొ బఱ్ఱె లెల్ల మెల్లఁ
బాదలె మళ్ళలోనిమంచు పూరిమేయనూ
నిన్నులేపకుండ మున్న కన్నె లార్తితోడ నేఁగ
నున్నమాట విన్నవించి నిన్నులేపఁగా
వచ్చినార మనుచు మమ్ము మెచ్చి ముదము హెచ్చినట్టి
మచ్చెకంటిమిన్న లేచి మములఁ గలయవే
మల్లవరులయుల్ల మెల్లఁ బెల్లగిల్ల కొల్లలాడి
వెల్లివిరిసి యుల్లసిల్లు విష్ణుమూర్తి నీ
పాడుకొనుచు నేఁగి చిగురు టీనువచ్చునడుగుఁదమ్మి
జోడుసోఁక మ్రొక్కి సరగ వేఁడుకొంటిమూ
ఎంతవింత కాంత లంత కంతకంత కింతయనుచుఁ
జింతచేసి మనలఁగరుణ చెలఁగిప్రోచునే.

౯

## ' తూమణిమాడత్తు '

వాఁడెవచ్చి పిలువలేచి వత్త మనుచుఁ బండుకొన్న
చేడె నిదురలేపఁగాను జెలులువచ్చిరీ
మణివిచిత్రసౌధమందు మంగళార్థమైనదీప
కణిక లుల్లసిల్లఁబొగలు గమ్మమనఁగనూ
కులుకుతళుకుశయ్యనిద్రఁ గూరినట్టిమేనమామ
కూర్మిబిడ్డ! గడియతలుపు గొలుసుమలుపవే
అత్త! పూలగుత్తి నీదు ముత్తియంపుబిడ్డ మెల్ల
నొత్తిగించి నిదురలేవ నెత్తరాదటో!

మూఁగచెవుడు గలవొలేక రాఁగనీకమత్తునిదుర
సాఁగితూఁగనెవరుమందు చల్లినారలో
మాధవుండుమాయలాడు వేషకైనబోధలేని
గాథవానివెయివిధాల గణనచేతుమూ
అమ్మ! తోడి కొమ్మ లిరుగో, లెమ్మసంగదమ్మ ముద్దు
గుమ్మ నీదుతపసుఁగులుకుబొమ్మ నిప్పుడూ

౧౦

'నోటిచ్చువర్గం'

నందనందనుఁడన నానందమొందువారలొక్క
సుందరదన నిదురలేపఁ గోరి వచ్చిరీ
నోఁచునోముస్వర్గమిచ్చు నోచెలియిదేలతల్పు
వైచిపండుకొంటివిట్లు వడిగరాగదే!
నీటుమీఱఁబల్కువున్న చోటనుండిమాటి కొక్క
నోటిమాటకైనమేమునోఁచలేదటే
వలసినట్టిచోట కలసి మెలసి సిరులవెలసి శ్రీ
తులసిదండఁ గురులనిండఁ దుఱుమువాఁడటే
పొంగి మంగళంబులొసఁగి పొగడినంతమనకునంత
రంగవాంఛలిచ్చుపుణ్య రాశిగాఁడటే
ముందునిదురయందుఁబేరు నొందినట్టికుంభకర్ణు
డిందు నోడి నీకు నిద్ర యిచ్చినాఁడటే
తత్తరమ్ముమానినిద్ర మత్తువీడివచ్చిచెల్మి
కత్తెలతో నిపుడు నీవు పొత్తుగూడవే.



రాబోవు నవీన ప్రబంధము:

# సత్యభామా సాంత్వనము.

ఉంగనమూరి రామేశ్వరకవి కృతము.

నాలుగు ఆశ్వాసముల శృంగారప్రబంధము.

— ♦ కొన్ని ఉదాహరణములు ♦ —

శా. ఉల్లాసం బొనగూడ నగ్గలపుతో ♦ నొయ్యారపుంజూపు లు
ద్వెల్లిలం బగఁ జేతు లెత్తి బిగపుం ♦ దళ్కొత్తుపాలిండ్లతో
మల్లాడం దగునింతి నప్పుడికడవల్ ♦ నాల్పసలిం బూనుచున్
చల్లో చల్లని చల్ల యమ్ముమరు ని ♦ చ్చల్ గొల్లచాన ల్పురిన్. ఆ. ౧.

చ. ఉరమున గుబ్బ లాని హరి ♦ యుల్కుచు మాటలఁ దేర్చి పల్కుచున్
దరుణిని నిండుకౌఁగిటను ♦ దార్చి నయంబు లొనర్చి హామికల్
బెరయ బిరాలునన్ బొటన ♦ వ్రేలునఁ గుబ్బల రెమ్మ నీవి వోఁ
బొరలి చివుక్కునం గదిసె ♦ బోటియుఁ దా నెదురెత్తు లియ్యఁగన్. ఆ. ౨.

ఉ. చొక్కక చొక్కినట్లు మఱి ♦ చొక్కియుఁ జొక్కనియట్లు చొక్కి పైఁ
జొక్కినయట్లు మేలువగఁ ♦ జూపుచు వాతెరకాటు మేపుచున్
మ్రొక్కుచుఁ దక్కుచున్ సొయల ♦ ముద్దులఁ బెట్టుచుఁ జెక్కుగొట్టుచున్
చక్కెరబొమ్మ యోరటిలఁ ♦ జక్రధరుం డతివిస్మితాత్ముఁడై. ఆ. ౨.

ఉ. కొప్పునఁ బూలు చెక్కి వెడ ♦ కోపము దీరఁగ మ్రొక్కి తేనియల్
చిప్పిల మోవి నొక్కి నును ♦ చెక్కిలి ముద్దిడి తక్కి వేడుకల్
చొప్పడ నొక్కి చక్కి తమిఁ ♦ జొక్కి కవుంగిటఁ జిక్కి చక్కియా
యొప్పులకుప్పచొప్పెఱిఁగి ♦ యూరటఁ దేరుట లెంక నెన్నఁడో. ఆ. ౩.

సీ. పరిక్కలోఁ బవళించి ♦ పదము పై హవణించి
యచ్చోటు గదియించి ♦ హాసు మించి
జిగిగుబ్బ లానించి ♦ బిగియ సం దొనరించి
పెదవి కెంపులు నించి ♦ బెద రణంచి
మో విచ్చి తేలించి ♦ ముద్దాడి లాలించి
మఱుద్దుగాఁ గదియించి ♦ మోహరించి

పాలిసి సి పలుకుంచి ♦ చెలఁగి స న్నెలయించి
పుంఖాన మొనరించి ♦ బుజ్జగించి
తే. గీ. నేగ సభిముఖినై తోన ♦ విముఖ మగుచు
భ్రమణ మొనరించి రమణుఁ బ♦రా కటంచు
మురుపుతో వ్రాలి నీమేని♦యొరపు లెల్ల
నింక నొకసారి దయసేయ♦వే యొయారి. ఆ. ౩.

సీ. గుమలతోఁ దొడలాశ ♦ నెదురు నాతనిత్రొమ్ము
దురుసుగుబ్బలఁ గ్రుమ్మి ♦ త్రోసిత్రోసి
కొను గొప్పను గేలఁ ♦ గమిచి వాఁ డద రంటఁ
గెళకి సందిలి నొక్కి ♦ నులికియులికి
తివిరి చెల్వుఁపు లోఁబె♦దవి కాటు తవిలింపఁ
గుక్కి యు స్సని చెక్కుఁ ♦ గొట్టికొట్టి
యుబికి మోవాని వాఁ ♦ మాకొన కరఁచొక్కుఁ
గెరలి తిట్టుచు నొడు♦గఱచికఱచి
తే. గీ. మేను వసియాడఁ దమిఁ గూడ ♦ మొలుపుతోడఁ
గొను జవ్వాడ నవహార♦కలిక లాడ
మరుఁడు ఝుంపించు గేదగి♦కిరుసుకరణి
మురిపెమునఁ బొంగి నటియించె ♦ మోహనాంగి. ఆ. ౪.

ఉ. ఆతఱి మందయందుఁ బడు ♦ నట్టుగఁ గొమ్ములఁ గట్లఁ గ్రుమ్మి లోఁ
బోతర మొప్పఁగా మరుని♦పోరుశకై గమకించి పైపయిన్
ద్రోఁతకు హుంకరించి మెయి♦మశాకొని మూతుల నెత్తి హత్తి యాఁ
బోతులు అంకె వేయుచును ♦ బోరనఁ జేరె సమాంసమీనలన్. ఆ. ౪.

కం. పురుషాయితమున నటువలె
మెఱయుచు సరిగెలుపు లెనయ ♦ మెలఁతుక తనియన్
హరి చెలి నణఁచుక తనిసెన్
చిరిగొరకల పాదుశాయి♦విజయము మీఱన్. ఆ. ౪.

**1937** ఏప్రియల్ మాసారంభమున వెలువడుతుంది.



# శృంగార కావ్యగ్రంథమండలి.

## ఉద్దేశము.

మృదుమధురపదవిలాసహావభావవిశేషభూషితయగు నాంధ్రభాషాయోషామణి చక్కనియక్కరములను వినసొంపుఁ గూర్చు నజంతశబ్దములను గలిగి సులభోచ్చారణార్హత నెగడు చున్నది. ఇట్టి మనయాంధ్రభాషను వినినను జదివినను మనస్సునకు వికాసమును బుట్టించు రమణీయరచనావిశేషమే కవిత్వమనంబరఁగును. కవిత్వము కవుల హృదయములయం దుద్దీపించురసమువలనఁ దనంతనే యుద్భవించి యమృతరసోపేతమై యతిహృద్యమై రసికజనాస్వాద్యమై నెగడును.

శా. సౌరభ్యంబును బంధచాతురి తగన్ శయ్యాచమత్కారశృం
గారంబున్ వివిధార్థముల్ సరససాంగత్యంబు నానాకళా
పారీణత్వము మంజువాగ్విభవముం బాంచాలరీతిన్ దగ
న్వారస్త్రీయనుబోలె నొప్పవలదా వర్ణింపఁ గావ్యంబిలన్.

—రుక్మాంగద చరిత్రము (మల్లన.)—

కవిబ్రహ్మ నిజహృదయకేదారమున భావామృతసస్యమును బండించి రసికులకువిందొనర్ప నేయేసమయములయం దేయేస్థితిగతులయం దేయేరసపోషణమును గావింపవలయునో వానినెల్ల స్వభావకల్ప

నలహేఁజూపుచుఁ [illegible]నూతనప్రపంచనాగరకతను జాటుచుఁ బ్రజలయుత్తమజీవనమునకును దేశక్షేమాభివృద్ధికిని గారణభూతములుగాఁ గావ్యములను రచించును. మంజులపదశోభితమై యలంకారభూషితమైన కవితను గాఢముగ హృదయమున నాటునటుల నవరసములుచిప్పిలునటులఁ జెప్పవలెనన్న నది కవికేచెప్పనలవిగాని కవిగాని వానికెన్నటికిని జెప్పఁదరముకాదు. కావ్యము నవరసభరితము.

శృంగారాదినవరసంబులలో సర్వప్రాణిసహజమనోజ్ఞమైనదియు సర్వభూతహృదయావాసగమ్యమైనదియు నగుశృంగారరసమే సర్వజనాదరణీయము. కావుననే శృంగారరసము పరిపుష్టిఁజెంది పాఠకులహృదయము వెల్లివిరియునటుల నాయికానాయకుల హృదయగతభావము లున్నవియున్నటులవర్ణించి ప్రబంధకవులందఱుఁ దమతమ సామర్థ్యమును వినియోగించి కావ్యములను రచించిరి. కావ్యమునందుఁ జమత్కారముగవర్ణించి రసావిర్భావమును గలుగఁజేయుట కవిధర్మము. అట్లువర్ణించుట యసమంజసమన్నఁ గవికిఁ బ్రకృతి ప్రలోచనమును లోకవంచనాపరాధమును గలుగఁజేసినవార మగుదుము.

నగరార్ణవోద్యానసలిలక్రీడావిప్రలంభరతోత్సవాద్యష్టాదశ వర్ణనలంగలిగి మహాకావ్యసజ్ఞం బడయుచున్న కావ్యలక్షణంబునకుఁ గావ్యప్రకాశకుఁ డిట్లుదాహరించెను.

శ్లో. నిశ్శేషచ్యుతచందనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరో
నేత్రేదూరమనంజనే పులకితా తన్వీ తవేయం తనుః
మిథ్యావాదిని ! దూతి ! బాంధవజన స్యాజ్ఞాతపీడాగమే
వాపీం స్నాతు మితో గతాసి న పున స్తస్యాధమ స్యాంతికమ్.

కావున లాక్షణికుఁడగు కాళిదాసు శ్రవ్యకావ్యంబుల రతివర్ణనము నింద్యముకాదనుటకోయనఁ గుమారసంభవాష్టమసర్గంబున వాచ్యంబుగ బాహ్యరతంబును వ్యంగ్యంబుగ నాభ్యంతరరతంబును వర్ణించి శృంగారవర్ణనమునకుఁ దోవతీర్చెను. మఱియు నాతఁడే

దృశ్యకావ్యంబగు మాలవికాగ్నిమిత్రములోఁగూడ బాహ్యరతంబనఁ దగు సంభోగశృంగారముల నిట్లువర్ణించెను.

శ్లో. నస్పృజే ప్రియ మూరునిపీడనం ప్రార్థితం ముఖమనేన నాహరత్
మేఖలా ప్రణయలోలతాంగతం హస్త మస్య శిథిలం రురోధసా.

శ్లో. హస్తం కంపయతే రుణద్ధి రశనావ్యాపారలోలాంగుళీః
హస్తౌ స్వౌ నయతి స్తనావరణతా మాలింగ్యమానాబలాత్.

శ్లో. పాతుం పక్ష్మలనేత్ర మున్నమయిత స్సాచీకరో త్యాననం
వ్యాజేనా ప్యభిలాషపూరణసుఖం నిర్వర్తయ త్యేవ మే.

ఏకవియైనను రతంబును వ్యంగ్యముగానే వర్ణించెనుగాని వాచ్యముగాఁ జెప్పియుండలేదు. ఆంధ్రశృంగారకావ్యంబులంగూడఁ దఱచుగా నిట్లేప్రతికావ్యము సురతపుంభావరతవర్ణనలు గనఁబడుచున్నను నవి రతిసురతోపరతిపుంభావాదిపదఘటితంబులగుటచేఁ గొందఱు చదువరులకు జుగుప్సాకరంబులైన యాభ్యంతరరతవర్ణనలుగా భ్రమ కలిగించుచున్నవేమో కాని నిజముగానవి యట్లుగాక వ్యంగ్యసురత వర్ణనపరంబులైన బాహ్యరతవర్ణనలేయని పరిశీలించినపిదప గ్రహింపఁ గలరు. ఈవిషయమున సంస్కృతకవులు సురతవర్ణనసేయునప్పు డొక్కవిషయనిగరణముగా వర్ణించినచోట్లఁగాక మిగిలినయెడలఁ దమ పాకమునుమార్పక యేకరీతిగావర్ణించిరి. మనయాంధ్రకవులట్లుగాక తమకదళీద్రాక్షపాకములను నారికేళపాకముగామార్చి స్త్రీ బాల సామాన్యదురవగాహముగా వ్యంగ్యముగానట్టి వర్ణనలుగావించియుండిరి. కావునఁ గేవలవాచ్యంబులు నశ్లీలంబులు నగునాభ్యంతరసురత వర్ణనలు వచనీయంబులగుటఁ బరిత్యాజ్యంబులనియు వ్యంగ్యంబులు తద్వర్ణగర్భితంబులునగు వర్ణనలు రసభావజనకంబులు కావ్యోద్యమ ఫలంబులునగుటఁ బరిగ్రాహ్యంబులనియు సాంస్కృతిక లక్ష్యలక్షణ గ్రంథములను జదివినఁ దెలియఁగలము.

భారతము రామాయణము మొదలగుపురాణేతిహాసములు ధర్మాదులస్వరూపమునుజూప సృష్టింపఁబడినవి. కావ్యములన్ననో

వాఙ్మయముయొక్క విశేషమును గనఁబఱుపఁ దలకొనినవి గాన వాని వానిపని యవినిర్వహించుట దూషణపాత్రములుకాఁజాలవు. శృంగారము విశేషముగా వర్ణింపబడినదనుటకు మనలోనున్న భావములన్నియు దాఁచిపెట్టక పూర్ణముగ వర్ణింపఁబడినవని యర్థమేకాని యస్వాభావికములును ననుభవవిరుద్ధములును వర్ణింపబడలేదని తెలిసికొనంజనును. నాయికానాయకుల మనస్సులలోలేని ప్రకృతివిరుద్ధములైన భావములేవియు నేకావ్యమునందును వర్ణింపఁబడియుండలేదు. కావుననే మధ్యకవులు తమప్రబంధములలో సామాన్యులకు బోధపడనంతకఠినముగ శృంగారరససందర్భముల నభివర్ణించిరి.

ఈశృంగారకావ్యములు తమకుఁదామే చదువుకొని యానందింప నుపయుక్తములేకాని వీధిపురాణములుగాఁ జెప్పందగినవికావు.

తమతమ కాలమంతయుఁ గావ్యరచనయందే కడపి కష్టములనైన లెక్కసేయక భాషాదేవి కమూల్యాలంకారములొనర్చిన పూర్వకవులకావ్యములలోఁ జాలకావ్యములింతవఱకు మనవారు ప్రకటించి యెఱుంగరు. కొలఁదిగాఁ బ్రకటించినను వర్ణలోపములును గణయతిప్రాసాదిలక్షణవైపరీత్యంబులుఁగలిగిన "గుజిలీ" పుస్తకములుగాఁ బ్రకటింపఁబడినవి. ఇవి చౌకగా దొరుకునన్నమాటయేకాని ఫలమిం చుకయైనఁ గనుపింపదు. ఇంకఁ గొందఱుపెద్దలు మంచి కాగితములపైఁ బ్రకటించిరిగాని వారు ప్రాచీన కవికృతములగు కావ్యములను ముద్రించునపుడు విశేషజాగరూకతతో శృంగారరసోద్బోధకములగు పదములనుమార్చి యిష్టమువచ్చిన పదములనుజొన్పి తామట్లొనర్చునపుడు రసభంగమగుననియైన నెంచరైరి. ఉదాహరణముగాఁ గొన్నిటినిందువివరింతుము.

గజేంద్రమోక్షములో :—

సిరికింజెప్పఁడు.............శ్రీకుచోపరిచేలాంచలమైన

ఇందు—శ్రీభుజోపరిచేలాంచలమైన—అని మార్చిరి.

కుచేలోపాఖ్యానములో :—

శ్రీకుచాలి ప్తచందనాంచితకరాబ్జతలము.

ఇందు—శ్రీకరాలి ప్తచందనాంచితకరాబ్జతలము—అని మార్చిరి.

భర్తృహరిలో యతినృపతిసంవాదమున :—

పృథుఘన స్తన నమితోత్కట వారకాంతలము.

ఇందు—పృథుఘనస్వన నమితోత్కట వారకాంతలము—అని మార్చిరి.

ఘనస్వనమువలన వారకాంత లెందుకువంగుదురని యడిగిన నేమిసమాధానముచెప్పెదుమా యనియైనఁ జింతసేయక యెవరికిఁ దోఁచినరీతిని వారు దిద్దివైచిరి. ఇంకఁ గొందఱుపెద్దలు శృంగార రసోద్బోధకములగు పద్యములను దీసివైచియే ప్రకటించిరి. ఇప్పటికిఁ బ్రకటించినవి కొలఁదియైనను నీవిధముగా వెలువడినవేకాని సరియగుగ్రంథములు వెలువడలేదని చెప్పవచ్చును. కావున నింక సారస్వతముపై నాంధ్రులెల్లరు దృష్టులను బ్రసరింపఁజేసి మాతృభాష నుద్ధరింప బద్ధకంకణులుకండు. కాదని పోనాడితిరేని కాళిదాసాది మహాకవుల కవితామృతమును, వాల్మీకాది ఋషిపుంగవుల జ్ఞానధనమును, పాణిన్యాదిసూత్రకర్తల సర్వతోముఖమగు సూత్రనిబంధనయు, వ్యాస గౌతమాదుల పరమార్థతత్త్వవివేచనమును గోలుపడు ననకతీరదు. ఆ కాలపు ధర్మము, జ్ఞానము, శౌర్యము, నుత్సాహము నన్నియు నశించినవి. ఇఁక సారస్వతమొకటిమాత్రము ప్రాణావశిష్టమై నిలిచియున్నది.

విజ్ఞేయాంశములను విముఖులకుఁగూడ నభిరుచిఁగల్పించి యందములను జందములను జిత్రములను నీతులనుజేర్చి హృదయరంజకముగ నుపదేశించుటయే శృంగారకావ్యరచయితల యుద్దేశముగాన వారిశృంగారప్రబంధములు సకలరసంబులకును నలంకారములకును సంపూర్ణశబ్దజాలమునకును ఛందోవ్యాకరణజ్ఞానమునకును నీతికిని నాక

రంబై యాఘనికులసాహిత్యసంపదలకు రత్నపేటికలై యర్థాంతరన్యాసంబులు లోకోక్తులు, స్వభావోక్తులు, లోకానుభవంబులు, నీతిదాయకములునై త్రివర్గఫలంబొసఁగి యాంధ్రలోకము నుద్ధరింపఁ జేయుచున్నవనుటలో సందేహములేదు. కచకుచాదులు కాంతకెట్టి సహజాలంకారములో శబ్దార్థాలంకారములును గవితాకాంత కట్టి తనూద్భావములగు సహజాలంకారములని పండితప్రసిద్ధము.

సంస్కృతగ్రంథములనుండి భారత భాగవత పురాణముల నాంధ్రీకరణముసేయుటయే యాంధ్రకవిత్వమున కాద్యదశయని మనమెఱుంగుదుము. తరువాతఁ బ్రబంధకల్పన ప్రారంభమై పెద్దన నాటికి విజృంభించి క్రిందటిశతాబ్దమువఱకు నవిచ్ఛిన్నముగా శృంగార ప్రబంధములు తలసూపినవి. ప్రబంధకవులు భాషాచమత్కారము, కల్పనాచాతురి, రచనానైపుణ్యము, భావపుష్టి, రసోజ్జృంభణము, నింగితావిష్కరణచాకచక్యమును గనఁబఱచుచుఁ దమయసాధారణ పాండిత్యమును వెల్లడించుచు శ్లేషాద్యలంకారములు స్వభావసిద్ధములుగాఁగానుపింప శృగారరసావిర్భావమునం దగ్రగణ్యతఁ జెందునటులఁ బ్రబంధములను రచించిరి. ప్రబంధములు పురాణములవలెఁ గథాసంవిధానచమత్కారమును వెల్లడింపఁగడంగక భాషాగాంభీర్యమంతయు నొక్కచోనమావేశమొనర్చి పాఠకులమనంబులకు విస్మయానందమును గల్పించి తన్మయత్వమునొందించుటకే రచింపఁబడినది. నిష్పక్షపాతబుద్ధితో విచారించినఁ బ్రబంధములయందుగల భాషాచమత్కారము భారతమునఁగాని మఱేపురాణములయందుఁగాని లేదనఁ గలము. భారతభాగవతపురాణాదులు కథాసంవిధానమున నెంత పొగడఁదగినవో భాషాచమత్కారమునఁ బ్రబంధములుకూడ నంత పొగడఁదగినవేయగును. కావుననే శృంగారప్రబంధకవు లొకరు వ్రాసినకథనే యింకొకరు వ్రాయుచుఁ దమకుగల భాషాపాండిత్యమును వర్ణనావిశేషమును జూపందొడంగిరి. అహల్యాసంక్రందన కథను వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యులు "అహల్యా సంక్రందన విలాస" మను నామమునను, సముఖము వేంకటకృష్ణప్పనాయ

నడుమ "అహల్యాసంక్రందనము" అను నామమునను వేఱొకరు "అహల్యావిలాస" మను నామమునను వేర్వేర ప్రబంధములను రచించిరి. ఇదేవిధముగాఁ తారాశశాంకవిజయము, బిల్హణీయము, విప్రనారాయణచరిత్రము, రాధికాసాంత్వనము, రాధామాధవము, విజయవిలాసము మొదలగుకథల నొక్కొక్కదాని నిరువురు మువ్వురు కవులు ప్రబంధములుగా రచించిరి. వీనిలోఁగొన్ని "గుజిలీ" పుస్తకములుగా వెనుకనచ్చొత్తింపఁబడినను నచ్చొత్తింపనివానిలోఁ బాటిపు డెచ్చటను దొరకుటలేదు. ఇవ్విధముగా నీశతాబ్దము గతించినయెడల నీ శృంగారప్రబంధములును గతించుననుట యతిశయోక్తి కాఁజాలదు.

జనుల కొక్కొకకాలమున నొక్కొకవిషయమునం దభిరుచియు, నాదరమును, నభిమానమునుగలుగును. మనుష్యులకుఁ గర్మసాధనములగు శరీరములెట్లుభిన్నములో యట్లు తదంతర్వర్తియగు మనస్సును బుద్ధియుఁ దజ్జన్యములగు నూహాపోహలును భావములును నిచ్ఛలును భిన్నభిన్నములుగానుండును. ఒకరిమనస్సునకు మంచిదనితోఁచినది రుచించినది యింకొకరి మనస్సునకు మంచిదనితోఁచదు రుచింపదు. ఈశృంగారకావ్యములు కొంద ఱవినీతిని బోధించునని యసహ్యాపడుదురు. కొందఱు భాషాదేవికమూల్యాలంకారములని సంపూర్ణశబ్దజాలరచనోపేతములని శృంగారభావరసోజ్జృంభణములని శిరమునఁదాల్తురు. ఎవరియభిప్రాయ మెటులుండినను వాఙ్మయమున స్థిరముగానుండదగిన శృంగారకావ్యములను బ్రకటింపకపోవుట యాంధ్రవాణి ననాదరించుట యనితలంచి భాషాప్రపంచమునఁ బూర్వకవుల ప్రబంధములను నిలువఁబెట్టి భాషాసేవనొనర్పవలెనను నుద్దేశముతో నీసంఘమునుస్థాపించి నన్నయభట్టుమొదలు క్రిందటిశతాబ్దమువఱకు రచింపఁబడిన శృంగారప్రబంధములను వెలువరింపఁదలంచితిమి.

ఇప్పటివలెఁ బూర్వము ముద్రణాయంత్రసాహాయ్యము లేకపోవుటవలన నీకావ్యములు వ్రాయసగాండ్ర హస్తగతములై యనేక

పాఠాంతర బేధములనుగలిగి వెలయుచున్నది. పూర్వగ్రంథములను ప్రకటించువారిదివఱకుఁ దమయిష్టానుసారము వానినిసవరించి తాము ప్రమాణముగాగ్రహించిన వ్యాకరణాది సూత్రములకు ననుకూలముగాదిద్ది ప్రకటించుచుండిరి. కొందఱీపద్ధతి నాక్షేపించుచు మూలమెట్లుండెనో తెలుపవలెననుచుండిరి.

గీ. ఇందుశేఖర పాదార • విందయుగళ
భావనాపరుఁ డంగనా • పంచబాణుఁ
డతులదైర్యాభిభూతహి • మాచలుండు
మానభూనాథుచిత్తాప • ఖానుఁడతఁడు.

కీర్తిశేషులగు శ్రీవీరేశలింగము పంతులుగారు చిత్రభారతమును బ్రకటించునపుడీ పద్యమునందు "చిత్తాపఖాను" శబ్దమును "చిత్తాబ్దఖానుఁ" డుగ దిద్ది ప్రకటించిరి. తరువాతఁ జరిత్రకారులు మానుఁడను దండ్రినిగలిగిన చిత్తాపఖానుఁడను నొకతురకనవాబు హిందూదేవాలయములకు దానధర్మముచేయువాఁ డుండెనని తెలిసికొని పంతులుగారుదిద్దినది తప్పని సిద్ధాంతరీకరించిరి. కావున మేమీకావ్యములకు మాయొద్దఁగల ప్రతులతో సంప్రతించి గ్రంథమర్థమై యన్వయించునటుల సంగతిసందర్భములనుబట్టి గ్రంథకర్తయొక్క కవనమున కనుకూలముగా గ్రంథపాతములను దిద్దుచు దిద్దిన భాగము కుండలీకరణముననుంచి ఫుటయడుగునఁ బాఠాంతరములను జూపుచుఁ బూర్వచ్ఛందోవ్యాకరణశబ్దజాలచరిత్రాదులను గుఱించి శోధనలను జరుపువారికి నుపకరించుటకును బాఠకులకు సౌకర్యముగానుండుటకును లేఖకప్రమాదజనితదోషంబులను గలుగనీయక శృంగారరసోద్భేదకములగు పద్యములనెత్తివేయక ప్రతిగ్రంథము తెల్లనిగ్లేజు కాగితముపై ముద్రించి మెంబరులకంపఁ సంకల్పించితిమి.

ప్రథమకుసుమము.

ముద్దుపళని కృతమగు

రా ధి కా సాం త్వ న ము

ఈశృంగారప్రబంధము 1937 సంవత్సరప్రారంభమున పంపుదుము.

ద్వితీయకుసుమము.

లింగనముఖకామేశ్వరకవికృతమగు

స త్య భా మా సాం త్వ న ము

ఇయ్యది రెండవగ్రంథముగా 1937 ఏప్రియల్ నెలమొదటఁ బంపగలము. ఇట్లె ప్రతిమూఁడుమాసములకు నొక్కొకప్రబంధమును బంపఁగలము. కావున భాషాభిమానులగు దేశీయులెల్లరు మాసంఘమునఁజేరి మాయుద్యమునకుఁ జేయూఁతనొసంగఁగోరెదము.

శ్రీకృష్ణరాయావలంబమున వినూత్నశోభావిరాజమానయై రాజకీయాధికారమువహించి కృష్ణాగోదావర్యాది మహానదుల దీర్థమాడి శ్రీశైలదాక్షారామాది పుణ్యక్షేత్రముల సందర్శించి యుత్కలమధ్యరాష్ట్రమహారాష్ట్రములుహద్దుగఁ గన్యాకుమార్యగ్రి పర్యంతము నిరంకుశముగ విహరించి యిపుడు నిరాలంబయై శృంగార రసం బొకింత యైన లేమిఁ గలకలలాడని మోముతోనున్న యాంధ్ర భాషాయోషామణికిఁ దొల్లిటితొడవులగు శృంగారకావ్యముల నుద్ధరించుటకు దృఢప్రయత్నులరగుఁడు. దేశమును భాషను నుద్ధరింపుఁడు. రాఁబోవుతరములవారి మన్ననలనందుఁడు.

—♦ ని య మ ము లు . ♦—

1. ఇరువదివత్సరములకు మించినవయస్సుగలవారును ఆంధ్రభాషయం దాదరాభిమానములుగలవారును నీసంఘమున మెంబర్లుగాఁ జేరుటకర్హతగలవా రగుదురు.

2. స్త్రీలు విద్యార్థులు ఇరువదివత్సరములకు లోబడినవారు, అవివాహితులు యీసంఘమునఁ జేర్చుకొనఁ బడరు.

3. ఈసంఘముకొఱకు వెలువరించుప్రథమగ్రంథము 1936 సంవత్సరము డిశెంబరు నెలాఖరునకు తయారగును గాన నీలోపల యిందు మెంబర్లుగాఁ జేరఁదలంచువారందఱుఁ జేరఁగోరెదము.

4. తాము సంఘమునుండితీసికొను శృంగారప్రబంధములను స్త్రీ బాల పామరాదుల పాలఁబడకుండఁ గాపాడవలయును.

5. ఈసంఘముప్రకటించు శృంగారకావ్యములు మెంబర్లకేపంపుదుము కాని యితరు లెంతవెల యిచ్చినను విక్రయింపము.

6. మేము వెలువరించు ప్రతికావ్యమునకును జాలవ్రాఁతప్రతులను సంపాదించి ప్రబంధమురచించిన కవియుద్దేశానుసారము పండితులచేఁ బరిష్కరింపఁజేసి పాఠాంతరభేధములతో లేఖకప్రమాద జనితదోషంబులు కలుగకుండునటుల ముద్రింతుము.

## —♦ నిబంధనలు. ♦—

1. ఈమండలి నచ్చొత్తింపఁజేసిన శృంగారప్రబంధములన్నియుఁ దీసికొన సామర్థ్యముగలవారే మెంబర్లుగాఁ జేరఁదగును.

2. మెంబర్లుగాఁజేరఁ దలంచువారు యీసంఘముయొక్కనియములను దెలిసికొని మేముపంపిన ప్రమాణపత్రమును బూర్తిచేసి ప్రమాణపత్రముతోగూడ ప్రవేశరుసుముక్రింద రు. 0—8—0 లు మాత్రముపంపవలయును.

3. మూఁడేసినెలల కొక్కొక్కటివంతున సంవత్సరమునకు నాలుగు శృంగారకావ్యములను ముద్రిపింతుము. ప్రతిగ్రంథముతయారైన వెంటనే ప్రతిమెంబరునకును దెలియఁజేసి వారివారిప్రతు లేవిధముగా బంపునదియు నాయాప్రతి యెంతవెల యైనదియుఁ దెలుపఁగలము.